యుఁ గపటముగా 'ఎవరు వ్రేలితోఁ దలుపు దట్టుచున్నారు?' అని యడిగెనుకృష్ణుఁడు 'కుటిలాత్మురాలా! మాధవుఁడను' అనెను. అందులకది 'వసంతుఁడా' యని యడుగఁగాఁ గృష్ణుఁడు 'కాదు చక్రి' యనెను. దానికది 'కుమ్మరియా' యనఁగాఁ గృష్ణుఁడు 'కాదు ధరణీధరుఁ' డనెను. అది 'సర్పమగు ఆదిశేషుఁడా' యనఁగాఁ గృష్ణుఁడు 'కాదు నేను భయంకరమగు సర్పమును మర్దించినవాఁడను' అనెను, అందుకది 'గరుడుఁడా' యనఁగాఁ గృష్ణుఁడు 'కాదు నేను హరిని' అనెను. దాని కది 'కోఁతియా' యని యడిగెను. ఇట్లా గొల్లకన్నియ ప్రతివచనములచే గెలువఁబడినకృష్ణుఁడు మిమ్ము రక్షించుఁగాక.

అవ. రాధగృహమునుండి చంద్రావళియింటికిఁ బోయి తలుపు దట్టఁగా చంద్రావళికిని కృష్ణునికిని గలిగిన యుక్తిప్రత్యుక్తికను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ రాధామోహనమన్దిరా దుపగత శ్చన్ద్రావళీ మూచివాన్
రాధే క్షేమ మయేఽస్తి తస్య వచనం శ్రుత్వాఽఽహ చన్ద్రావళీ
కంస క్షేమ మయే విముగ్ధహృదయే కంసః క్వ దృష్ట స్త్వయా
రాధా క్వేతి విలజ్జితో నతముఖః స్మేరో హరిః పాతు వః. 111

టీ. రాధామోహనమన్దిరాత్—రాధయొక్క మనోజ్ఞమైన గృహమునుండి. ఉపగతః సన్=వచ్చినవాఁడై, చన్ద్రావళీం=చన్ద్రావళీ యనుమటిరొక గోపికనుగూర్చి, ఊచివాన్=ఇట్లుచెప్పినవాఁడయ్యె, అయే రాధే=ఓరాధా, క్షేమం=కుశలము, అస్తి=కలదా—నీవు కుశలమా యనుట, ఇట చంద్రావళిని రాధ యని తలఁచి 'రాధా! క్షేమమా'యని యడిగినాఁడని తెలియునది, తస్య=ఆకృష్ణునియొక్క, వచనం=మాటను, శ్రుత్వా=విని, చన్ద్రావళీ=చంద్రావళి, కంస=ఓ కంసా, క్షేమం=క్షేమమే, అని, ఆహ=చెప్పెను. చంద్రావళి తనకు రాధ మిక్కిలిపగతురాలు గనుక అట్టిరాధగాఁదలఁచి తన్నుఁ గృష్ణుఁడడుగఁగాఁ గోపించి తాను కృష్ణునికి మిక్కిలి పగవాఁడగుకంసునిగాఁ గృష్ణునిగాని 'కంసా! క్షేమము' అనెనని మనోభావోద్ఘాటనము తెలియునది. ఇందులకుఁ గృష్ణుఁడు, 'అయే=ఓసీ, విముగ్ధహృదయే-విముగ్ధ=మిక్కిలిచేలమైన, హృదయే=హృదయము గలదానా, కంసః=కంసుఁడు, క్వ=ఎక్కడ, త్వయా=నీచేత, దృష్టః=చూడఁబడినాఁడు—కృష్ణుఁడ నగు నేను వచ్చియుండఁగాఁ గంసుఁడంటివే! ఇక్కడఁ గంసుఁడు నీకగపడినాఁడా? యని కృష్ణుఁడడుగుట తెలియునది. అందులకుఁ జంద్రావళి, రాధా=రాధ, క్వ=ఎక్కడ (త్వయా=నీచేత, దృష్టా=చూడఁబడినది) ఇతి, అని, (ఆహ=చెప్పెను) అని అధ్యాహార్యము. కంసుఁడెక్కడఁ గనబడినాఁడని నన్నడిగితివే నీకు రాధ యెక్కడఁ గనఁబడినది చెప్పుమని యన్నదని తెలియునది. 'నీకుఁ గంసుఁడెట్లో నాకు రాధ యట్లు' అని దీనిచేఁ దెలిపినదని యూ

కించనది. ఇట్లడిగినందులకు, విలజ్జితః=మిక్కిలి లజ్జను బొందినవాఁడై. నతముఖః=వంగి నముఖము గలవాఁడును-మొగము వంచినవాఁడును, స్మేరః=నవ్వు గలవాఁడును అగు, హరిః=కృష్ణుఁడు, వః=మిమ్ము, పాతు=రక్షించుఁగాక.

తా. రాధయొక్క [illegible] ముఖ్యముగా [illegible] వచ్చి, కృష్ణుఁడు చంద్రావళిని జూచి రాధ గా భ్రమించి 'రాధా! క్షేమమేగా' యని యడుగఁగా, చంద్రావళి కోపించి 'కంసా! క్షేమ మే' యనుచుండ, కృష్ణుఁ డాకిటువలె దెలియక 'ఓసీ! నీవు గంసునిచేక్కొనఁగఁబడినావా' డనఁగాఁ జంద్రావళి 'నీవు రాధ యెక్కడఁ గనఁబడినది' అని యడుగఁగా గృష్ణుఁ డది చంద్రావళి యని తెలిసికొని సిగ్గున దల వాంచి నవ్వుకొనెను. అట్టికృష్ణుఁడు మిమ్ము రక్షించుఁగాక!.

శ్లో॥ యా ప్రీతి ర్విదురార్పితే మురరిపో కుంత్యర్పితే యావృశీ
యా గోవర్ధన మూర్ధ్ని యా చ పృథుకే స్తన్యే యశోదార్పితే।
భారద్వాజసమర్పితే శబరికాదత్తేఽధరే యోషితాం
యా ప్రీతి ర్మునిపత్నిభక్తిరచితేఽప్యత్రాపి తాం తాం కురు॥ 112

టీ. హే మురరిపో=ఓవిష్ణూ, విదుర + అర్పితే=విదురునిచే నర్పింపఁబడిన యన్నమునందు, యా=ఏ, ప్రీతిః=ప్రియము గలిగెనో, కుంతీ + అర్పితే=కుంతిచే నర్పింపఁబడిన దానియందు, (యా ప్రీతిః=ఏప్రీతి కలిగెనో)-ఇక్కడ మీఁద నిట్లు దెలియునది. గోవర్ధనమూర్ధ్ని=గోవర్ధనపర్వతశిఖరమున, ఏప్రీతి కలిగెనో, పృథుకే=(కుచేలుని) అటుకులయందును, యశోదా + అర్పితే=యశోదచేత నీయఁబడిన, స్తన్యే=చన్నుఁబాలునందును, భారద్వాజసమర్పితే=భరద్వాజుఁ డొసఁగినట్టి విందునందును, శబరికాదత్తే = శబరి యిచ్చిన ఫలాదులందును, యోషితాం=గోపస్త్రీలయొక్క, అధరే=మోవియందును, ముని...రచితే-మునిపత్ని=మునులభార్యలచేత, భక్తి=భక్తితోడ, రచితే=కల్పింపఁబడినయన్నము నందు, (యా ప్రీతిః=ఏప్రీతి కలిగెనో) అత్రాపి = ఇందును-ఈకర్ణామృతమందును, తాం తాం=ఆయాప్రీతిని, కురు=చేయుము.

మ. శ్రమణావన్యము రాధికాధరము భారద్వాజువిందుల్ ముని
ప్రమదాభక్తము మాతృదత్తకుచధారల్ విప్రుముంగొంగుభ
క్ష్యము గోవర్ధనపూజయున్ విదురుమృష్టాన్నంబుఁ గుంతీసప
ర్య మదిం గైకొనునట్లు నాకవితఁ గృష్ణా ప్రీతిఁ జేకోఁగదే. 112

తా. ఓ కృష్ణా! విదురునియన్నమందును, కుంతి పెట్టినభోజనమందును, గోవర్ధన [illegible]పట్టియన్నాదులందును, కుచేలునియటుకులందును, యశోదచన్నుఁబాలయందును, భారద్వాజుఁడు చేసినవిందునందును, శబరి యిచ్చినఫలంబులందును, మునిభార్య

లు పెట్టిన యున్నమందును, ఏప్రీతి నీవుండెనో యట్టిప్రీతి యీకర్ణామృతమందును నుండు పుము.

శ్లో॥ *కృష్ణానుస్మరణా దేవ పాపసఙ్ఘాతపఞ్జరః ।
శతధా భేద మాయాతి గిరిర్వజ్రహతో యథా॥ 113

టీ. పాప... పఞ్జరః-పాప=పాపములయొక్క, సఙ్ఘాత=సమూహమనెడి, పఞ్జరః=గూడు-గూటివలె బంధకమైయున్న పాపసమూహ మనుట కృష్ణ+అనుస్మరణా దేవ=కృష్ణు నెడతెగక స్మరించుటచేతనే, వజ్రహతః=వజ్రాయుధముచేఁ గొట్టఁబడిన, గిరిః యథా=కొండవలె, శతధా=నూఱువిధములుగా, భేదం=బ్రద్దలు పాఱుటను, ఆయాతి=పొందుచున్నది.

తా. వజ్రాయుధముచేత కొండ నూఱుబ్రద్ద లగునట్లు, బంధకమైనపాపసమూహము కృష్ణు నెడతెగక స్మరించుటచేతనే పటాపంచలగును.

ఇతి శ్రీలీలాశుకవిరచితే శ్రీకృష్ణకర్ణామృతే తృతీయశతకం సమాప్తమ్.

క. వనజాక్షుఁడు కర్ణామృత
మును జదివిన వ్రాయ వినినఁ బురుషులకును నో
ధనకనకవస్తువాహన
తనయాదిసమృద్ధి శాశ్వతంబుగ నొసఁగున్.

మాలినీవృత్తము. జలరుహదళనేత్రా సర్వరాడ్వైరిపుత్రా
ఖలజనఘనవాతా కంజసంజాత తాతా
సలలితగుణభూషా సత్యనిత్యైకభాషా
విలసితసితహాసా వేంకటాహార్యవాసా.

మ. ఇది కృష్ణాశ్రయయోగిపుంగవకృపాకవీక్షాత్తసారస్వతా
భ్యుదయశ్రీవిభవప్రసిద్ధ చిదచిద్వద్బ్రహ్మతత్త్వమాశాంతిన
త్యుదయాభూషణ వెల్లపూడిమణి పెద్దామాత్య వెంగాగ్రణీ
గదితాఖ్యానము వొల్చుఁ బ్రాథమిక మై కర్ణామృతస్వోక్తిన్.

---

* ఈ శ్లోక మొకానొకప్రతియందే కనుపట్టుచున్నది కనుక దీనికి వెనుకను పద్యము లేదు.